భారతధర్మ దర్శనము

317 పే.లు

4000

ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురణములు 1.





# భారతధర్మదర్శనము.



ద్వితీయ ప్రతి.

మచిలీపట్టణములోని ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము
(లిమిటెడ్) చే బ్రచురింపఁబడినది.

బందరున
శ్రీ భైరవ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.



| | |
|---|---|
| సంఘదాయకులకు | ఇతరులకు |
| వెల రు. 0-1-6. | వెల. రు 0-2-0. |

# Introduction.

ఆంధ్రులకొక విజ్ఞాపనము.

మన దేశమున నూతనముగ బయలువెడలిన జాతీయజీవనభావము మనల ననేకాభివృద్ధిసంపాదనావిషయక ప్రయత్నములకుఁ బురికొల్పుచున్నది. ఈజాతీయజీవనపోషణకును, దానివ్యాపకమునకును, ముఖ్యసాధనము జాతీయవిద్య (National Education). జనసామాన్యము సాక్షరులయినఁగాని దేశాభివృద్ధి యసాధ్యము. ఈసంగతిని మనమందఱమును దెలిసికొని జాతీయవిద్యాలయములను (National Schools) స్థాపించుటకుఁ బ్రయత్నించుచున్నాముగదా! వీనియందు జరగవలసిన విద్యాభ్యాసమునకు సాధనముగ నుండుటకును, మనలోఁ దెనుఁగు భాషను మాత్రము నేర్చిన మహాజనులకు జ్ఞానసంపాదక మార్గములుగ నుండుటకును దెనుఁగుభాషయందు వ్రాయఁబడిన సనాతనాధునాతనేతిహాసములుగాని (Ancient or Modern History), ప్రకృత్యాది శాస్త్రములుగాని (Sciences), అన్యదేశదార్శనిక గ్రంథములుగాని, (Philosophical works) జీవితవృత్తాంతములుగాని (Biographies) రేఖాగణితాదిగణితశాస్త్రసంబంధమగు గ్రంథములుగాని (Mathematical works), రాష్ట్రపరిపాలనపద్ధతులను దెల్పు రాజనీతిశాస్త్రములుగాని (Political sciences), జాతీయసంపద్వృద్ధి మార్గములను బోధించు నార్థికశాస్త్రములుగాని (Political Economy), వృత్తులను, పరిశ్రమలను, వాణిజ్యమును నడుపు విధములను దెల్పు గ్రంథకోటిగాని (Books on Trades, Manufactures or commerce) నానావిషయసుబోధకములగు యఖ్యాయికలుగాని (Novels), మన భాషలోఁ బేర్కొనుట కొకటిరెండైనఁ గానరాకున్నవి. ఇంగ్లీషు,

ఫ్రెంచి, జర్మను, భాషలలో నిట్టి గ్రంథరాజములు లెక్కకు మిక్కిలిగాఁ గలవు. అయినను జాతీయవిద్యావ్యాపకము మాతృభాషలో సాధ్యమైనట్లు విదేశభాషలలోఁ గానేరదు. విద్యాభ్యాసముయొక్క ప్రారంభదశలయందె మన కిప్పుడు గలవిదేశవిద్యాభ్యసన నిర్బంధమే యింత దనుకను మన యభివృద్ధికిఁ బ్రతిబంధకంబై జనసామాన్య మీదేశమున నిరక్షరు లగుటకుఁ బ్రబలకారణ మయినది. కాఁబట్టి మన జాతీయవిద్య నాంగ్లేయభాషలో నభ్యసింపఁజేయఁ యత్నించుట నిష్ఫలమయిన కార్యము.

ఆంధ్రులలో జాతీయజీవనమును, జాతీయవిజ్ఞానమును గల్పింపఁ బూనుకొనినచో నాంధ్రసాహిత్యాభివృద్ధి(**Improvement of Telugu Literature**) కంటెసాధనాంతరము లేదు. మన దేశభాషలలో బంగాళీమహారాష్ట్రభాషలు నిరంతరాభివృద్ధిని గాంచుచున్నవి. వారన్య భాషలలోఁ గలయుత్తమగ్రంథముల ననేకములను మాతృభాషలోనికి భాషాంతర మొనర్చుకొనియు, నూతనగ్రంథరాజములను వ్రాసికొనియు, వారిభాషలను దినదిన ప్రవర్థమానములుగఁ జేయుచు, ఆభాషలను వాడుకొను జనులయందు జాతీయ జీవనభావమును గల్పించుచున్నారు. వారిభాషాభివృద్ధియె వారి సంఘాభివృద్ధికిని గారణమై భాషాభివృద్ధికిని దేశాభివృద్ధికిని గలపరస్పరసంబంధమును దెల్పుచున్నది.

ఈభాషాసాహిత్యాభివృద్ధియొక్క యత్యావశ్యకతను మనవారు కొందఱు గ్రహించి యాంధ్రగ్రంథరచనకుఁ దగినప్రోత్సాహమును గల్పించుచున్నారు. శ్రీమునగాల జమీందా రగు నాయని రంగారావు బహద్దరుగారును వారియమాత్యశేఖరులగుకొమరగిరిలక్ష్మణరావుపంతులు ఎం. ఏ. గారును మఱికొందఱు దేశాభిమానులును గలిసి విజ్ఞానచంద్రికా గ్రంథమాల యనుపేరఁ గొన్నిగ్రంథములను బ్రచురించుట కేర్పాట్లు చేసియున్నారు. అయినను మనభాషకుఁ గల కొఱఁత యొకరిద్దఱిచేఁ దీర్పఁబడఁదగినది గాదు. విశ్వమానవకోటి యొక్క భావికాల ప్రాప్యా భివృద్ధికి మేరలేదు. మనమార్జింపఁదగువిజ్ఞానమునకు మితిలేదు. అట్లగు

టచే మన కుండఁదగిన గ్రంథసముదాయముయొక్క స్వభావమును సంఖ్యయును యనిర్వచనీయములు. ఒక్క నూతనవిజ్ఞానము, నూతనాదర్శము, నూతనభావము, గ్రంథశతములచేతఁగాని వ్యక్తీకరింపఁబడనేరదు. మనసాహిత్యాభివృద్ధి కి ట్లసంఖ్యాకము లగుప్రయత్నములు జరుగవలయును గాన మేమును బందరుపురమున "నాంధ్రభాషాభివర్ధనీ సంఘము, లిమిటెడ్" అనుపేరుతో లిమిటెడ్ లయబిలిటీ గల జాయింటు స్టాకుకంపెనీ నొకఁదానిని రు 10,000 ల మూలధనముతో స్థాపించినాము.

ఈ సంఘమువారియొక్క ముఖ్యోద్దేశము మన యభివృద్ధికిఁ గావలసిన గ్రంథములను మన మాతృభాషయందు వ్రాయించి ప్రచురించుటయె. మనదేశమున విద్యాధికులు పెక్కండ్రు దేశాభిమానమును ఉత్సాహమును గలవారయ్యును చాలవఱకు నీరసస్థితియందున్నవారు. దేశస్థితినిబట్టి వారు దినమంతయుఁ బాటుపడినఁగాని పుత్రకళత్రాదులను బోషించుకొనుటయే కష్టముగనున్నది. ఇట్లు పెక్కుయిక్కట్టులకులోనై ఘటయాత్రసలుపువారిని యూరక గ్రంథములను వ్రాయుఁడని చెప్పుట సాధ్యమొగాని నెఱవేర్పుట సులభము గాదు. కాఁబట్టి యిట్లు శ్రమపడి గ్రంథములు వ్రాయువారికి వారిశ్రమనుబట్టియు గ్రంథమునొక్క స్వభావమును బట్టియుఁ గొంత మూల్యముగాని ప్రతిఫలముగాని యిచ్చుటకుఁ దగినసదుపాయము లేర్పఱచినచో గ్రంథరచనకు మఱికొంత యెక్కువప్రోత్సాహము కలుగునని తలంచితిమి. ఇట్లు చేయుటచే ద్రవ్యసాహాయ్యమక్కఱలేకుండఁ దమధనమునుశక్తిని ధారవోసి పాటుపడఁ దగిన దేశభక్తాగ్రేసరుల ప్రయత్నములకును మిక్కిలి యుపకారము గలుగునని మానమ్మకము. మనవృద్ధికి చిన్న చిన్న విషయములలోఁ జేయఁదగినప్రయత్నములు సయిత మట్టివారు చేయవలసియుండుటకు బదులు యిట్టి చిన్న చిన్న మూలధనములు గలకంపెనీలవల్ల నెఱవేర్పఁబడినప్పుడు సంపన్నులు ప్రయత్నములు మహద్విషయములకై ప్రవహింపవచ్చును.

మేము ప్రచురింపఁబోవు గ్రంథములయొక్క రూపనిరూపణముఁ జేయుటకు ప్రస్తుతము సాధ్యముగాదు. కొంతవఱకు నాంగ్లేయాది భాషాంతరములనుండి యాంధ్రీకరణ మొనర్చుట ప్రప్రథమమునఁ గావఁదగినపని. ఏతద్విషయ ప్రయత్నము లిందనుక జరుగుచునేయున్నవి. అయినను కేవలభాషాంతరీకరణముచే భాషాభివృద్ధిగాని సంఘాభివృద్ధిగాని మన ప్రస్తుతదశయందుఁ గలుగవు. విదేశీయులయితిహాసములు, వారిసాహిత్యము, వారివిజ్ఞానము, వారియాచారము, వారిధర్మములు, మనయితిహాసములు, మనసాహిత్యము, మనవిజ్ఞానము, మనయాచారము, మనధర్మము, గానేరవు. స్వధర్మవిసర్జనముచేతను పరధర్మావలంబనముచేతను మనము పొందినభంగమిప్పు డనుభవైకవేద్యముగనేయున్నది గద. కావున మేమీ యభిప్రాయమును మనస్సునందుంచుకొని యేదియో యొకవిధముగ మన జాతీయ జీవనోద్ధారణకు సహాయభూతములగు గ్రంథములనే ముందుగఁ బ్రచురింపఁ బ్రయత్నించితిమి. ఈజాతీయవిజ్ఞానతరంగిణి దేశమందుఁ బ్రవహింపఁజొచ్చిన తరువాత మనకొదువప్రయత్నము లన్నియు దాని యుపశాఖలవెంటనే పొలుచుండును. గ్రంథరచనకు నాయాశాస్త్రానురూపమగుపరిభాష (Nomenclature) యావశ్యకము. అది బొత్తిగ మన భాషలో లేదు. దానిని కల్పించుకొనక గ్రంథములు వ్రాయుట యసాధ్యము. ఇట్టి గత్యంతరాభావమును మనము గమనించుచు నిట్టిపరిభాషను సమకూర్చి యొక నూతననిఘంటువును వ్రాయింపవలయును. అంతదనుకఁ బలువురచే వ్రాయఁబడుచున్నను మాగ్రంథమాలయందంతటను సాధ్యమయినంతవఱకొక్కపరిభాషయె వాడఁబడును.

మాప్రచురములకు మార్గదర్శకుఁడుగ నుండుటకై "భారతధర్మదర్శనము" అనుదేశభక్తుని ప్రప్రథమమున నాంధ్రదేశమున సంచారార్థము పంపుచున్నాము. ఆంధ్రులు దాని నాదరించి దానివెనుక రాఁబోవువారికై నిరీక్షించుచుందురని నమ్ముచున్నాము. సుప్రసిద్ధుఁడైన యీధర్మదర్శన గ్రంథకర్త మాతృదేవతకు భక్తిపూర్వకముగ సమర్పించిన

యీాయుపాయినము నాామెకు నివేదనఁజేయునర్హకవిధిని మాసమాజమునకుఁగల్పించినందుకాాయనకు నూకృతజ్ఞతాసూచక వందనము లాచరించుచున్నాము.

ఆంధ్రభాాషాభివర్ధని సంఘము,
(లిమిటెడ్)
మచిలీపట్టణము.
1-10-1907.

వేమువరపు రామదాసు,
కార్యదర్శి.



# ద్వితీయప్రతి కుపోద్ఘాతము.



శ్రీదం, బఖిలవిద్వజ్జనానందసంధాయకంబు, నిర్మలదేశాభిమానశోభితం బగునీపొత్తంబు రెండవకూర్పునకుం గొలఁది కాలంబుననె యవకాశ మొదవినందుల కాంధ్రమహాజనులకు వందనము లర్పించుచున్నారము. మొదటి ప్రతియం దుండిన ముద్రణాది లోపంబులను నివర్తించి యీప్రతి సాధుజనాదరణీయం బగున ట్లొనర్చితిమి. ఇం దింకను నెరసు లెయ్యెడనైనం దోఁచిన విబుధులు మము మన్నింప బ్రార్థితులు. ఈపొత్తము వెలువడినదాదిగ నీసంఘమువారు ప్రకటించిన గ్రంథనామములను దద్వివరణమును సంగ్రహముగ నీపుస్తకముకడపటఁ జేర్చితిమి. భాషాభిమానులు వాని నవలోకించి దేశాభివృద్ధ్యర్థ మొనర్పు నీసత్కార్యాచరణంబున నీసంఘమువారికిఁ జేయూఁత నొసంగుదు రంచుఁ బ్రార్థించుచున్నారము.

మచిలీపట్టణము.
1-10-1908.

క. భాస్కరరావు.



గీ॥ ఆంధ్రభాషాభివర్ధని కాదరమున
జ్ఞానవంతు లనర్ఘమా గ్రంథరత్న
ముల సమర్పణ సేయుఁ డమూల్యమైన
కానుకలు గాగ నందఱు ఖ్యాతిమెఱయ.

గీ॥ ఆంధ్రభాషాభివర్ధని యభ్యుదయను
నంద నాబాలగోపాల మఖిలజనులు
సకలకలలను విద్యల సాంతముగను
జదివి ధీయుతు లగుదురు శాశ్వతముగ.



# ఆంధ్రభాషాభివర్ధనీ సంఘోద్యమము.

గీ॥ కామ రోషాది దుర్దమాజ్ఞానతిమిర
సమితి దుల్లంగ నుత్తమసాధనంబు
జ్ఞానఫలపరిపక్వ మెంచఁగ ధరిత్రి
కాయ నుదిరినఁ గుసుమంబు వాయకున్నె.

గీ॥ మోక్షలబ్ధికిఁ గేవల మూలమైన
జ్ఞానమును దెల్పు కృతు లసంఖ్యాకములుగఁ
దొల్లి పెద్దలు రచియించి రెల్లజనుల
యెడ ననుగ్రహమునఁ జేసి యొసక మొనఁగ.

గీ॥ సంస్కృతజ్ఞానమవనిఁ బ్రశస్తిఁ గాంచ
జగతి కెల్లను నొజ్జయై శాశ్వతమగు
ఖ్యాతి నందెడు మన దేశమాత; యిందు
నించుకయు లేదుగా పరాపేక్షమనకు.

గీ॥ మోక్షలబ్ధికిజ్ఞానంబు మూల మనుట
యైహికాముష్మికములయథార్థ మగుట
యైహికంబగు ముక్తికి నాకరమగు
నాధునిక విద్య మనకగు నభ్యసింప.

గీ॥ అఖిలశిల్పకళారహస్యములు ప్రకృతి
శాస్త్రనిచయను రాజిక సాంఘికార్థి
కాదివిషయ విశేషము ల్యంత్రశాస్త్ర
మర్మము లెఱుంగఁగావలె మనకునిప్డు.

గీ॥ సకలవిద్యలు కళలును శాస్త్రములును
వివిధదేశ చరిత్రము ల్విశదరీతి
సర్వజనులకు నాంధ్రభాషను దెలుపఁగ
నాంధ్రభాషాభివర్ధని యవతరించె.

# శ్రీరస్తు.

## కృత్యాది.

శా॥ పుత్రప్రేమ నశేషదేశజనులం బోషించుచోఁ దానహో
రాత్రంబుల్ పనిఁబూని దీనజనసంత్రాణక్రియన్ సత్క్రియా
పాత్రంబౌ తనమేన లంచిన జగత్ప్రఖ్యాత విక్టోరియా
ధాత్రీపాలిని నీశుడెప్పుడు దివి న్ధన్యాత్మగా నిల్పుతన్.

చ॥ అతులదయాపయోధి యగు నాయమయం దమృతాంశుఁడై కృపా
న్వితుఁడయి నుజ్జనించి యనుజేక్షణ కౌతుక మొప్పవచ్చి యీ
క్షితిఁ గని చక్రవర్తిగుణశేఖరుఁడై చను శ్రీయుతు న్సమీ
హితయుతుఁ జేయుతం గరుణ నేడ్వర్డుప్రభు నీశ్వరుండిలన్.

శా॥ దేశానర్థమువాపి దేశహితమర్థింగూర్పఁగ న్మండలా
ధీశత్వాద్యధికార మూర్వ్యములుగా నేర్పడ్డ ధన్యాత్మకున్
దేశస్థు ల్బమదేశవృద్ధి మది నుద్దేశించి కావించునా
దేశక్షేమవిధానయత్నములు సిద్ధింబొందఁ దోడయ్యెడున్.

చ॥ ఉదయంబయ్యెను పారశీకుల సుధార్ణోరాశికిం జంద్రుఁడై
పదిదిక్కు ల్వెదఁజల్లె దీనజన తాపం బెల్లఁ జల్లార సౌ
ఖ్యదమా నిర్మలకీర్తికౌముదిని దివ్యద్దేశభక్తిస్థిరో
సదయాశీలుఁడు కేవలుండె యల నౌరోజీ మహాత్ముండిలన్.

# X.

మ॥ పదియార్వన్నె పసిండి సొంపువెలయింపంజాలి 'హాటిల్లిన
ట్లాదవెన్బుద్ధి విశారదత్వమున కోహో యిట్టిసౌజన్యమీ
సదయాంతఃకరణం బటంచు జనముల్ శ్లాఘింప నొప్పన్నగ
ద్విదితుం డింతటిధన్యుఁ డెందుఁ గలఁ డీ దేశంబునం జూడఁగన్.

మ॥ నిజదేశోద్ధరణ క్రియారతమతిన్మేన్వంచి సౌఖ్యంబులన్
స్వజనంబు న్విగనాడి యోజన సహస్రంబేగి యాంగ్లేయ దే
శజనుల్మెచ్చఁ బ్రసంగముల్సలిపి తత్సామ్రాట్సభాస్తారుఁడై
విజయంబందె మహానుభావుఁ డితఁ డుర్విన్మంత్రిసామాన్యుఁడే?

శా॥ 'దాదా' యంచును 'భాయి' యంచుఁ బ్రజకు న్దాఁదండ్రియై యన్నయై
యీదేశంబు ప్రశస్తిఁగాంచి తనదాహీనస్థితిం బాసి నా
నాదేశంబుల కొజ్జ గాఁదగిన యా 'నౌరోజు' రావింప ని
ర్వేదంబేమియు లేక పాటుపడియె న్నిర్భీతి నన్వర్థుఁ డీ
దాదాభాయికి సాటి యెవ్వ రరయం ధాత్రి న్వదాన్యోత్తముల్.

శా॥ ఔదార్యంబున సాహసంబునను ధర్మాసక్తి నిస్తుల్యుఁ డీ
దాదాభాయికి భారతీయనిఖిలార్తక్షేమసంధాయికిన్
శ్రీదుం డీశుఁ డొసంగుఁగాత శుభము ల్సిరులున్ స్థిరారోగ్యమున్
వేదోక్తంబగు పూర్ణమాయువును సంప్రీతిన్ ధరామండలిన్.



ఖరకిరణుం డిషిం బొడివి
　　కార్కొనుమబ్బులుఁ గ్రొమ్మెఱుంగులున్,
సురుచిరరత్నకాంతులను
　　జూడ్కులకింపగు నింద్రచాపముల్,
తరణికరంబుల న్ధరణిఁ
　　దాకగనీకతనర్చు సల్లకీ
సరళతమాలసాల పన
　　సక్రముకామ్ర పటీర కేతకీ
కురవకకింశుకాది కుజ
　　కుంజసమంచిత కాననంబులున్,
హరితతృణాగ్రము ల్మెసవి
　　యంబరవీధిని గ్రేళ్లుదాటుమేల్
హరిణచయంబు, నృత్యసమ
　　యస్ఫుటపింఛము లౌమయూరముల్
సరసిజలక్ష్మిఁ జెన్నెసఁగి
　　సారసభృంగమరాళచక్రబం
ధురనినదంబులంబొదలు
　　తోయరుహాకరము, ల్లసచ్ఛవి
స్ఫురదురువిద్రుమంబులను
　　శుభ్రవినిర్మల మౌక్తికంబులన్
దరలతరంగమాలికలఁ
　　దద్దయునొప్పెడు సాగరమ్ములున్,
స్ఫురదమలాంశుజాలములఁ
　　బొంపిరివోయెడురత్నసానువుల్,

పరగుగిరివ్రజం బమల
　　వార్ణహారీ రమణీయవాహినుల్
ధరపయిస్వర్గసౌఖ్యమిడుఁ
　　దల్లిరో! నీప్రజకెల్ల కాలముఁ ॥

చ॥ మతములుసొచ్చినిల్లు, జన
　　మాన్యచరిత్రులు పుట్టినిల్లు, స
త్ప్రతిభదయాశమాదిగుణ
　　రత్నసమృద్ధికి రోహణాద్రి శా
శ్వతనిరపాయమోక్షఫల
　　భాసురవల్లికి నాలవాలమై
యతులవిభూతిఁ బొల్చు విల
　　సంబరో! నీసరిధన్యు లుందురే? ॥

క॥ శ్రీకరకరుణాశేవధి
　　లోకారాధ్యుఁడు విపన్నలోకావనుఁ డ
స్తోకశుభంబు లొసంగుత
　　నీకు నీప్రజకు నెపుడు నిండిన ప్రేమన్ ॥



దొరక నూటస్బదికైన లేదు దిన
నయ్యో! తల్లి ముప్పొద్దులన్ ॥

శా॥ గంగా సింధు మహానదుల్ యమునయుం
గావేరియు న్నర్మదా,
తుంగాభద్రయు బ్రహ్మపుత్రయు లస
ద్గోదావరీకృష్ణలున్
బంగాళాంధ్రకళింగకోసలములుం
బాంచాలముం గొంకణం
బుం గర్నాట మరాట దేశములనున్
ముక్కాలు ధాన్యంబులో
లిం గాపించి యొసంగినం గుడువఁ ద
ల్లీ!లేదు ముప్పొద్దులన్॥

శా॥ రంగద్రత్నమయూఖదీధితి సమా
రాజద్దరీ భ్రాజితో
త్తుంగక్ష్మాధరపంక్తులుం బరిలస
త్ఫుల్లాబ్జకాసారముల్
తుంగక్ష్మారుహశోభికాననము లెం
దున్ లోచనానందమో
లిం గావించుచునుండు, గూఁడొకటె త
ల్లీ! లేదు ముప్పొద్దులన్ ॥

శా॥ నైసర్గం బగుహస్తలాఘవము నా
నాసత్కళాసక్తి ని.
ద్రాసౌఖ్యాదివిహీనసంతతపరి
శ్రాంతిక్షమత్వంబునుం,

ధీసామగ్రి కులక్రమాగతలస
న్నిర్మాణనైపుణ్యముల్
వీసంబుం గొఱలేకయుం గుడువఁ ద
ల్లీ! లేదు ముప్పొద్దులన్॥

చ॥ ఫలకుసుమాదిసంపదలు
భాసురవస్తు సమస్త సంచయం
బులు బహురత్న హేమ పరి
పూర్ణఖని ప్రచురప్రదేశముల్
సలలితశుక్తి మౌక్తికము
లం బొగడందెడు సాగరంబులుం
గలిగియుఁ దల్లి! నీపౌరులకుఁ
గల్గదు గంజియు మూఁడుప్రొద్దులన్॥

సీ॥ ప్రొద్దున లేవంగఁ బోయిరాజవలెనన్న
నగ్నిహోత్రము స్వీడ నంపవలసె;
నాబాలగోపాల మఖలంబునకును మా
న్చెప్పరు పుట్టము శ్నేయనవలసె;
మునుమాపువ్యాయామమునకుఁ గందుకములు
లండను బంపుచు నుండవలసె;
వార్తకు లేఖిని పత్రము ల్వలయుచో
నాస్ట్రియా జర్మను లంపవలసె;

గీ॥ చిన్న బిడ్డలు త్రావంగ క్షీరములను
భాగ్యవంతులపాలపుఁ బంచదార
యూరిపేదల గంజికి న్నుప్పుఁగల్లు
నన్యదేశంబు లంపంగనయ్యె నకట!॥

సీ॥ పరనాగరికరాష్ట్రపాలురు ధరియించు
జిల్గుదువ్వలువలే చెంతకరిగెః
వారి దేవేరుల వలనొప్పఁ గైసేయు
పట్టుపుట్టంబు లేపజ్జకరిగెః
వరభటశ్రేణుల పాణుల మిఱుమిట్లు
గొలుపు కృపాణులే వలనికరిగె!
పరరాజసభల నాస్తరణంబులై యొప్పు
రత్నకంబళములే ప్రక్క కొదిగెః

గీ॥ రమ్యమైనట్టి నవరత్నరచనలవియుఁ
జిత్రరీతులఁ జెలొ్వందుశిల్ప మదియు
స్వప్నసంపదయో! యైంద్రజాలకంబొ!
నాఁగ సుంతయు లేకుండ సేగె సకట!॥

ఉ॥ మాసెకలాప్రవీణత, స
మస్తము నస్తమునొందె శిల్పము,
ల్వాసె నశేషభూరమణ
వాంఛిత భారతవర్ష సంపదల్,
డాసె సనగ్రహంబు, ధన
లక్ష్మి దొరంగి దరిద్రులై ప్రజల్
గాసిలి చిక్కి కెంతయును
క్షామ నిపీడితులై యజస్రముఙ్॥

ఉ॥ భారతవంశ శేఖరుఁడు
పార్థుఁడు మున్ హిమశైల సేతుమ
ధ్యోరుసమస్త రాజ్యరమ
నొక్క భుజంబున నిల్పినప్పు డెం

తే రహిఁ గొల్వుదీర్చు సభ
యిప్పుడు కన్నులఁగట్టినట్లుగా
భాగతమందుఁ గానసగు
వర్ణనసేయఁగ నేల వేఱుగన్?

శా॥ ఏనూతేండ్లకుమున్ను వీడదియె డె
ల్హీపట్టణంబై ముస
ల్మాను ల్నిల్వఁగ స్థానమయ్యెనట హు
మ్మాపు ల్గగం గొల్వఁగా
ఖానుల్దీర్చిన కొల్వుకూటములు వి
ఖ్యాతంబు లం దల్లషా
జ్హానుస్థాపిత బర్హిపీఠము మహా
చాతుర్యధుర్యంబిలన్॥

శా॥ ఆనిర్మాణమెగాకయా ధునికమై
యాగ్రాపురిం డాజ్మహా
ల్నానత్యద్భుత శిల్పమొండొకటిగ
న్నట్టు న్విలాసంబున
న్నానాదేశ సమాగతాఖిల జనా
నందానుసంధాయియై;
మీనాక్షీసదనంబువోల్చు మధుర
న్మేల్సేతల; న్వింతచం
దానం దత్పురి నొప్పు తిర్మల చమూ
నాథోత్తమాస్థానమున్॥

గీ॥ వింతహారువుల పనులచేవిస్తరిల్లి
జిలుఁగు సేఁతలకీతులఁ జెన్నుమీఱి

వన్నె చిన్నెలంకెంతయు వాసికెక్కి
వరలె శిల్పంబులెల్లఁ బూర్వమున నిచట॥

క॥ నేఁతల పోఁతల చిత్తరు
వ్రాఁతల నిర్మాణములను వాసిగనిన యా
తాతల తండ్రులవృత్తులు
చేతిపనుల్ దక్కి దిగిరి సేద్యమునఁ బ్రజల్॥

గీ॥ ఊషరక్షేత్రములు దొడ్డయూడ్పుచేలు
గ్రామకంఠంబులెల్ల నగాధ సలిల
గర్తములు నయ్యె నియ్యెడఁ గర్షకునకు
గడ్డిమిగులుట యెంతయుఁ గష్టమాయె॥

గీ॥ వృత్తు లీరీతి సన్నియు వెన్కఁబడియె;
సాహుకారుల లాభము ల్పదికిలఁబడె;
సంతవారలు మన దేశమన్యదేశ
వస్తువులనించి ముంచిరి వసట వార్ధి॥

ఉ॥ జాతిమతాదిభేదముల
సంస్కరణంబు మెయిం బరస్పర
ప్రీతియుఁ భ్రాతృభావమును
వీడి యొకప్పుడు నేకదేశసం
జాతులమన్నమాటను బ్ర
జల్గణియింపక దేశవృద్ధికిం
ఘాతుకులైరయో! జనుల
కష్టము లెన్నఁడు, తీరునో కదా?॥

శా॥ ఏవాడంగన 'నెల్లవారలును నెం
తే వృద్ధిగాంక్షించి యా

త్తావాసంబులు వీడిపోయి యఖిల
వ్యాపారము లుత్కళా
ప్రావీణ్యంబులు సంగ్రహింపఁ దమ పూ
ర్వఖ్యాతియే మెంచి మి
థ్యావైరాగ్యముఁ బూని యుందురిట న
త్యంతంబు సంతుష్టులై॥

శా॥ స్వారోగ్యంబును స్వప్రయోజనములన్
స్వైశ్వర్యముంగోరి సం
సారధ్వాంతమునందు రేలుఁబవలు
న్జాలన్ శ్రమంబందు చె
వ్వారుం దేశము దైన్యముం గలఁచి త
ద్వ్యావృత్తికై సుంతయు
న్ప్రారంభించి పరోపకారపథము
న్ప్రాపింప రేచాయలన్॥

ఉ॥ జాతిమతాదిభేద మతి
సంస్కరణంబు న క దేశసం
జాతులమన్న మాటను బ్రి
జల్మదినెక్కొన నిల్పి యాత్మలన్
భ్రాతృవిశేష భావనకుఁ
బన్పడఁ జేయుచు నైకమత్యము
న్నీతియుఁగల్గి దేశజన
నిం దరిఁజేర్తురె క్షూడి యందఱున్॥

ఉ॥ ఈమహి యంత్రశాలలకు
నేర్పడఁ దావలమౌనె యెన్నఁడేన్

సోమరులై యాజస్రమును
సుద్దులఁబ్రొద్దులు పుచ్చుచుండు ని
ష్ప్రామరులెల్లఁ బాటుపడు
భాగ్యము గల్గు నె భూరివిత్తముల్
భూమియు బుద్ధియుం గలుగు
పుణ్యులు భారము పూనఁజొత్తు రే॥

ఉ॥ క్షామముదీరునే ప్రజ క
కాలపు మృత్యువుపోలెఁ దోఁచి వే
మామక దేశవాసులను
మారి మసంగెడు మారియాలునే
సేమమునన్సుఖింతు రెయ
శేషజనంబులు స్వస్థ చిత్తులై
బాముఁదీరి నీదగు కృ
పారసవృష్టిని దేరి దేవమా॥

భారతవర్షమందు మన
వారలు పూర్వము బుద్ధిమంతులై
చారుదుకూలధారులయి
షడ్రసముల్భుజియించుచున్న డ
న్నారలుగట్టి కూరలశ
నంబుగనుండిరి యాన్యదేశపు
న్వారలటంద్రు; వారిపుడు
భాగ్యమునందులఁ దూఁగుచుండగాఁ
బేరు ప్రతిష్ఠయు న్నశిచి
పేదలమై వెడఁగూడుఁగూరయుం

జీరయులేక చిక్కువడి
చింతలపాలయి చెట్లుపుట్టలుం
జేరివసించుమానిక్రియ
జీర్ణశరీరము లర్థభుక్తిచే
నీరసమై కృశింపఁ గడు
నీచత నుంటఁ దలంప రేమియున్॥

శా॥ సర్వోత్కృష్టము లోకమందు ననుమా
సంఘంబె తత్తుల్యమీ
యుర్విన్ లేదనుచెల్ల సాహసము మా
యుక్తుల్ దగన్వేనవేల్
నిర్వక్రంబుగఁ జెప్పవచ్చు గ్రహము
ల్లేశంబును న్మాఱునే
పర్వంబు ల్దడవౌనె యొక్కయదసం
బంచాగముల్లఘ్పినన్॥

ఉ॥ ధీసకలత్వసంపద న
తీంద్రియదృష్టిని జేసి జైమిని
వ్యాసకణాద గౌతమప
తంజలులుం గపిలుండు ము న్నప
న్యాసమొనర్చినట్టి విపు
లాగమతంత్రములుం బురాణముల్
భాసురవేదకల్పకగ
ళన్మకరందమొ నాగఁ దత్వాజి
జ్ఞాసఁ జరించు భక్తులను
గావ స్వయంభగవ న్నిబద్ధమై

భాసిలుగీతయు న్నిగమ
వర్గము దుర్గమమయ్యె, శాస్త్రముల్
మాసెను, ధర్మనిష్ఠ యఖి
లంబు ఖిలంబయిపోయె నియ్యెడం,
బాసెన శేష విద్యలును,
వ్వమ్మయి పోయె సమస్తసత్కళల్॥

మ॥ మతివైశద్యము పాపభీతియును ధ
ర్మస్ఫూర్తియు న్వేచెడెన్,
మతవైషమ్యము లెచ్చె, భక్తికడు
సన్నంబయ్యె, దుస్తర్కముల్
వితతంబయ్యె, దయాశమాది గుణము
ల్మృగ్యంబు లయ్యెం గటా!
సతత ధ్వాంతము గ్రమ్మె దేశజన ధీ
సమ్మోహనంబై కడున్॥

మ॥ రఘురామార్జున వంశజాతులిన చం
ద్రాంశోద్భవు ల్సంగరా
లఘుదోర్దండ కృపాణకృత్త ప్రతికూ
లక్ష్మాపయోధానుమే
య ఘనప్రాభవ శోభితుల్నృపణులై
యందందఁ బాల్కాఁపులై
లఘువృత్తి న్నటయాత్రసల్పు టకటా!
లజ్జావహంబెంతయున్.

సీ॥ పండిన్రనాలిన్వయట్టి పైరైన నొల్లక
యుంఛవృత్తిఁ జరించుచుండియెప్డు

చలిచీమనైనను జాఁద్రొక్క నోపక
శమదమాదుల నొప్పుసత్త్వఖనులు
కూటికి పేదలై కూటసాక్ష్యములక
లీకసృష్టికిఁ గల్లపోకడలకు
దుర్దానములకును దుష్టాన్నములకును
హేయకృత్యములకు నెగ్గులేక॥

గీ॥ చొచ్చి యవియును గఱవైనఁ జూదమునకుఁ
జౌర్యమునకును బాల్పడి చతురులైరి
వారి నేమనవలయు నివ్వసుధలోన
రేమి యేమేమి సేయింపలేదు జనుల॥

గీ॥ దేశవృద్ధికిఁ జనువెన్నులరయఁ
బూనువారలపైఁ గసలూని వారి
యత్నముల కెప్డు మాఱుసేయం దలంచు
పండితమ్మన్యులను ననవలయుఁగాక॥

ఉ॥ ఆర్యులచే ననుష్ఠితము
లై చనుధర్మములందు నుత్కటా
నార్యము లైనకొన్ని తద
నంతరకల్పితము ల్ఘటించదు
ష్కార్యము లంచు సజ్జనులు
సంస్కరణం బొనరింప శాస్త్రవి
ద్వార్యుల మంచు నాగెదరు
వక్రకుతర్కములన్ సభాస్థలిన్॥

ఉ॥ మంత్రము సూత్రముం గ్రియయు
మార్పడెనో యనఁ దోఁచుపద్ధతిన్

న్యాయత్త్వుండయి సేవఁ జేయునెడ హే
యంబు ల్విశంకస్థితిం
జేయం జొచ్చియు నంతఁబోక యొకచో
చిత్తానుసారంబుగా
న్యాయాపేతత సంచరించుటయునా
ర్యాచారమేయారయన్?

శా॥ పరపాణిగ్రహకారణంబు కతన
న్బాధ్యంబు కన్యాపునః
పరిణేయత్వ మటంచుఁ బల్కు విధురు
ల్పత్నీ పునస్స్వీకృతి
న్నిరతౌపాసనకై యొనర్చి యటుపై
నిశ్శంకతం దారిల
న్విరతౌపాసనులై చరింతు రిదియు
న్వేదోక్త ధర్మంబొకో!

ఉ॥ ఏదెసఁ జూడ నివ్వసుధ
నెందును ధర్మము దేశకాలపా
త్రాదులఁబట్టి మాఱకొక
యాకృతినిల్చెనె యెల్లకాల మిం
దీదినమున్న ధర్మమది
యేండ్లు గతింప నధర్మ మయ్యెడుం
గాదని కేని యిందు మన
గ్రంథములే ప్రబల ప్రమాణముల్ ॥

శా॥ ఆర్యాచారము లేకరూపముననే
యాకల్పము న్నిల్చెనే

కార్యాకార్యవిచక్షుఁ జేయుచునస
త్కార్యంబు లొక్కొక్కచో
నార్యుల్మానరె మాంసభోజనము మ
ద్యాస్వాదముఁ దేవరా
నార్యన్యాయము లోనుగాఁ గలుగు హే
యంబైన కృత్యంబులన్ ॥

ఉ॥ ఏయెడనైన ధర్మవిదు
లెల్లరు నొక్కెడ నప్పటప్పటన్
న్యాయమతిం దగ న్నిలిచి
యారసి ధర్మకలాపమం దుపా
దేయము హేయముం దెలిసి
తెల్పినఁ గాక చిరంబు నిల్చునే
ప్రాయత దేశధర్మములు
మర్చెదెడు గాక యథాయథంబుగన్

ఉ॥ కావున దేశధర్మములఁ
గల్గిన క్షోభము నాత్మలందు సం
భావనసేసి యిందుఁ గల
పండితమండలియు న్నవీనవి
ద్యావిభవంబు పెంపునను
దారమతిం దమదేశవృద్ధికై
వావిరి పాటులం బడెదు
వారును ధర్మము నిర్ణయింపుడీ॥

శా॥ ఈపల్కు ల్గొచియింపవేని వినుడీ
యింకొక్కసూక్ష్మంబు మీా

కాపద్వ్యార్ధినిమగ్న దేశహితమే
యంగీకృతం బైనచో
నాఃపద్ధర్మములుండవే స్మృతులఁ ద
ద్వ్యాప్త్యర్హ కాలంబు దే
శాపత్కాలముకంటె నొండొకటి శ్రే
యం బెందునుంగల్గునే ॥

చ॥ శ్రుతులు పరస్పరంబునువి
రుద్ధములై బహుభంగి నుండెఁదర్క
స్మృతులుఁ బురాణము ల్గదుప
బృంహణముం దగఁ బూని భిన్నమై
మతిని భ్రమింపఁజేసెడిని
మాన్యమునిప్రధితంబులైనయా
మతము లసంఖ్యము ల్గలవె
మార్గము కేవల శాస్త్రచర్చలన్ ॥

శా॥ లోకానుగ్రహకాంక్షఁజేసి మిగుల
న్లోకార్తిఁజింతించి యెం
తేకారుణ్యము నాత్మఁబూని మది స
ర్వేశున్స్మరిన్ లోకర
క్షైకారంభకు నిల్పి శుద్ధమతితో
నామ్నాయము ల్చూచినం
గా కెట్లబ్బు నగమ్యధర్మచయ కాం
తారంబునన్మార్గముల్ ॥

శా॥ ధర్మజ్ఞత్వముఁ బూనుచో దయయున
య్యంబు స్వమస్ఫూర్తి స

త్కర్మాసక్తియుఁ బాపభీతియు లస
త్కారుణ్యముం గల్గి యే
మర్మద్వేషము లాత్మలేక వచియిం
పంగావలెంగాక వే
దుశ్తేధం దెగి నిశ్చయింప నది యెం
దు నొబ్బందునే యిమ్మ్రులన్ ॥

మ॥ సతతక్షామము దీరిపోవునె దయా
సత్యాదిసంపన్నులై
మతవిద్వేషముమాని యాత్మల వృథా
మాత్సర్యము ల్వీడి యం
చితభక్తిం బరమార్థచింతయునుని
శ్శ్రేయఃపరాకాష్ఠయున్
మతిఁ గాంక్షింతురె యెంతురే ప్రజలు దై
న్యగ్రస్తదేశస్థితిన్ ॥

మ॥ అతిబాల్యంబునఁ బిన్నపాపల వివా
హంబుల్నిషేధింతురే?
మతినూహింతురె యనాథకన్యలయసం
భావ్యార్తి బాహుళ్యమున్
వితతప్రస్ఫుటదేశదైన్యహరణా
పేక్ష న్విదేశంబులం
దతులాయాసము నందిచేరు పరమా
ర్థాప్తిం దగం గొందురే?॥

శా॥ శ్రీకళ్యాణగుణాకరంబు ఖిలసం
శిక్షాచణుం డార గ

త్మికారంభుఁ డనంతుఁ డద్వయుఁ డఖం
డానందకందంబు ప్ర
జ్ఞాకల్పద్రుమ మీశ్వరుండు దయతోఁ
గళ్యాణము న్నిచ్చలుం
జేకూర న్నెలకొల్పుఁ గాత మనకు
న్దేశాభిమానం బెదన్॥

సీ॥ వివిధ దేశప్రజ సవరించి యైకమ
త్యము గూర్చిమనుప సంధానకరణి
వైషమ్యవిషవహ్ని వాడిమూర్ఛిలుప్రజ
జీవింపఁజేయ సంజీవకరణి
చిరతమోగ్రస్తమై చీఁకటింటిని బోలు
దేశమాత్మప్రభఁ దేల్పఁ దరణి,
దేశకంటకులయి దిమ్మరుఖలచోర
సంతతివాప విశల్యకరణి

గీ॥ అతుల దేశార్తిపుంజ మాహుతియొసంగ
నగ్నిసంపాదన మొనర్ప నమరుసరణి
యట్టిదేశాభిమానంబు నాత్మసీమ
నెప్డు వెలయించుగాత సర్వేశ్వరుండు॥

శా॥ ఔదార్యంబును సాహసం బవిరత
వ్యాపారసంసక్తి ని

న్నదయత్వంబున నాటి సేతు రచనా
నైపుణ్య మేపారఁగా
నదుల న్సాగర గాముల న్పథమున
న్బంధించి వంధ్యోర్వి స
స్యద గావింపఁగఁ గుల్య లేర్పఱచి ర
థ్యాశ్రేణి నిర్మించి సౌ
ఖ్యదమై పొల్చు బ్రిటిష్ప్రభుత్వ మిల స్థై
ర్యస్ఫూర్తిం బరిఢిల్లుతన్ ॥



# భవిష్యద్భరతవర్షదర్శనము.

సీ॥ తల్లిరో! నీమది దైన్యంబు దక్కఁగము
నిరతిశయం బగునీదుపూర్వ
విభవంబు బహువిధ విద్యాసమగ్రత
సకలకలాజాల సౌష్ఠవంబు
రాజక సాంఘిక ప్రముఖనానావ్యవ
హార సౌమ్యతయుఁ బెంపారఁ గాంచి
సర్వసర్వంసహాచక్రావతంసంబుఁ
బురుషార్థ సర్వస్వపూర్ణ ఖనియు॥
గీ॥ మోక్షవిద్యాలవాలము నుదాత్త
ధర్మకల్పద్రుమూలంబు ధాత్రిదేశ
సంతతికి నొజ్జయును నయి సాటిలేక
యవనిఁ బ్రఖ్యాతిగాంతు వీ వచిరమునను॥
శా॥ ఉత్సాహంబున నీతనూజులు ప్రశ
స్తోద్యోగముం బూని మ
రాత్సర్యంబులు వీడి యేకమయి నీ
మాహాత్మ్యముం బూర్వసం
పత్సంపత్తియు సత్కళాకుశలత
న్విఖ్యాత వాణిజ్యసం
పత్సంసిద్ధియుఁ గూర్పఁ గాంచెద వఖ
ర్వంబైన యౌన్నత్యమున్॥
శా॥ పాతాళంబునఁ బశ్చిమాంబుధి తట
ప్రాంతస్థితంబైనయా

శ్వేతద్వీపమ్ము నందున న్వివమతవి
ద్వేషీభ కంఠీరవుల్
చేతోమోదము నొందగా శ్రుతిశిర
స్సిద్ధాంత తాత్పర్యముం
గీతాసారముఁ దెల్పుచుండ్రు ధిష ణా
గీఃప్రౌఢిమ స్నినుతుల్॥

శా॥ ఉద్యద్ధీప్రతిభావిలాస విభవో
ద్యుక్తిం గ్వదీయాత్మజుల్
విద్యుచ్ఛక్తి రహస్యము ల్దెలిసి వ
ల్లీ సంగతుల్లేకయే
విద్యుద్వార్తల నంపు సాధనముల
న్వేఁదెల్పఁ బాశ్చాత్యధీ
విద్యాసింధువు లెల్లఁ గాంతురు బలే!
విభ్రాంతులై యుండఁగన్॥

శా॥ అర్వాచీన సుధీ సమాజ సముదా
యాగ్రేసరు ల్మేముపీ
గర్వప్రౌఢులు నైసపశ్చిమధరా
ఖండాధినాథు ల్మహా
నిర్వేదంబున సీసుతు ల్గణితశాం
ఒబున న్సాహితీ
సర్వవ్యాప్తిని నక్షత్రతాగరిమ మిం
చం గాంతు రాశ్చర్యమున్॥

మ॥ హిమవన్మేఖలవింధ్యపార్శ్వమున స
హ్యాకాంతకాంతారదు

# భారతీయధర్మాధర్మనక్షత్రమాల.



గీ॥ పాఁడి దలఁచిన మనపాలి పాలవెల్లి
పైరు దలఁచిన మనపాలి పంట చేను
వసు సమృద్ధికి మనపాలి భాగ్య రాశి
భరత ఖండము మనతపః ఫలముగాదె॥

గీ॥ నిరత సర్వర్తు సుమఫల భరిత మహిజ
దేశమృగ పక్షి రాజితోద్దేశ మమల
వారిపూరిత నద నదీ భ్రాజితమగు
యఖిల ధాత్రికి నారామ మనఁగఁదనరు

గీ॥ ప్రజలు సద్విజ్ఞానముదారశీలు ధన్యమతులు
విమలసౌజన్య యుతులు పవిత్రచరితు
లఖిలశిల్పకళా రహస్యార్థ విదులు
సత్యశౌదార్య సాహస ప్రాంచితులును॥

గీ॥ కూటి కేమియు మనలకుఁ గొదువ లేదు
కోటు లెన్నియొ పోయెను గడ్డలకును
అప్రవాహము నాపంగ నాసకట్ట
యవస్వదేశోద్యమము నేఁటి కమరె మనకు॥

గీ॥ తండ్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి,
తండ్రియొసఁగిన దివ్యసాధనము దీనిఁ
గాని గడలగుడు కాపంగ జననిదైన్య
మిట్లొనర్చిన మనకగు నిష్టసిద్ధి॥

గీ॥ సన్ననూలున సరిగను జాతిపనులఁ
దోఁచు సంతోషమెల్లను దుచ్ఛమనుచు
దేశమాత యొసంగెడు లేశమయిన
మేరు వంచుఁదలంచుట మేలు మనకు॥

గీ॥ ముతుకబట్టలు గట్టుట నోటుదన మ
టంచు వెంగలులై మన మెంచఁ జనదు
హృదయ మందున నౌదార్య మొసఁగకున్నఁ
గల్ల మెఱుఁగులు నాగరికంబు రాదు।

గీ। చీని చీనాంబరంబులు జీనువార
సీమనారాయిచేఁ గండ్లు జేవురింప
జోకుగుడ్డపు బండిపైఁ జొక్కి వీధు
లెన్ని దిరిగిన గౌరవ మేల నబ్బు?

గీ। దేశజననిచేయొసంగెడి దివ్యమైన
ముతుకబట్టలు ధరియించి హృదయమునను
విమల దేశాభిమానంబు విస్తరిల్ల
మెఱుఁగులేకున్నఁ బోవునే గరిమ మనకు?

గీ। వేద వేదాంగములు గన్న విప్రులెల్ల
నాంగ్లచీరలు గట్టి రనాగరికులె?
కుచ్చుపాగాలుజుట్టి క్రేల్గోచి జాఱ
నగరిఁ దిరిగెడు శూరులు నాగరికులె?

గీ॥ తండ్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి
యన్నదమ్ములు మగు మన కైకమత్య
మును నిరంతర సౌభ్రాత్రమును బొసంగు
నివి యొసఁగిన మనకగు నిహము పరము॥

గీ॥ మనము బుట్టిన మన్నును మనము గలియు
మన్ను నియ్యది, గావున మనకు బైట
వేషభాషల భేద మెవ్విధి నొదవిన
హృదయ సీమల సౌభ్రాత్ర మెసయ వలయు॥

గీ॥ అన్నదమ్ముల జిహ్వాలయందు రుచులు
వివిధ మయ్యెడు భంగిని వేషభాష
లందు మతముల నూహాల నాచరణము
లందు భేదంబు లగపడ నొప్పునంటె?

గీ॥ ఎన్ని భేదము లుండిన నేమి మీరి
వార లొక్క కుటుంబపు వార లగుచు
నిల్లు దిద్దుకొనుట మన మెల్ల వోర్వఁ
జూచుచుండెద మిది యొకచోద్య మొక్కొ?

గీ॥ కాన దేశాభిమానంబు కలిగి క్రైస్త
వులు ముసల్మానులును హిందువులును పా
సీలు నొక్క కుటుంబమై చని దేశ
మాత నుద్ధరియింతురు గాతఁ బ్రీతి॥

గీ॥ దేశమందున శిల్పము దేజరిల్లఁ
గలలు వాణిజ్యమభివృద్ధి గాంచి మించఁ
బ్రజల కెల్లను జీవనోపాధు లమరి
దేశదారిద్ర్య మంతయుఁ దీరిపోవ॥

గీ॥ దేశజనముల హృదయ ప్రదేశములను
విమల దేశాభిమానంబు విస్తరిల్ల
దేశవిద్యాలయము లెల్ల దిశలయందు
వెలయ నెలకొల్పుదముగాత నెలమి జనులు॥

గీ॥ న్యాయసభలకు నూఱు పంచాయతీల
నెన్ని నూతనముగ నెలకొల్పి వమ్ముసేయు
సొమ్ము సమకూర్చి శిల్పము లభినవు సేయు
యంత్రశాలలు వేలు స్థాపింత్రు గాక॥

గీ॥ శక్తు లభ్యాస సహితమై జనులయందు
ఘన వికాసముగాంచి ప్రకాశమందు
శక్తు లభ్యాస రహితమైనన్ని గిల్లు
చాలకాల మాటులై పోవ సమసి పోవు॥

గీ॥ ఒరులపైనను వైషమ్య మొందె ద్వేష
మొందె సహియింపకయ మన మోపినంత
స్వప్రయత్నంబు సేయక స్వాభివృద్ధిఁ
గాంచఁజాలుదుమనుమాట కల్ల కల్ల॥

గీ॥ స్వాభివృద్ధి యనునున్నతి స్వాశ్రితమెయిఁ
గల్గవలెఁ గాయమ్వ్యాక గాక యొరుల
యీవిచేఁ గేవలంబుగ నెన్నఁడైన
వచ్చినేనియు నిల్పంగ వశము గాదు?

గీ॥ సంఘసంస్కారమును మతసంస్కృతియును
జేయునజకును నిదిసేయఁ జెల్లదనుట
యలలు సంద్రంబులోపల సాఁగుదనుక
స్నానమాడన టన్నయాజకుని మాట॥

గీ॥ పెండ్లి గుదురక కుదుర దీపిచ్చి మనకు
దేశవృద్ధికిఁ బురికొల్పి దేశజనుల
నొక్కత్రాటను జేర్పక యెక్కుడెట్టి
హితము చెప్పిన వారల హృదయములకు॥

గీ॥ దేశవృద్ధికి నైయిట్లు దేశజనులు
కూడిపనిచేయఁ దీఱెడుఁ గొఱఁ తలెల్ల
జాతిమతభేదములవల్ల సంభవించు
సర్వవైషమ్యములు నాఁడు సమసిపోవు॥

గీ॥ బువ్వలేనట్టి వారికి బుద్ధులెన్ని
చెప్పఁ బుట్టునె పెడచెవిఁ జేరుగాక
భుక్తిగుదురక కుదురదు ముక్తియనెడు
మాట దలపోయఁగా వట్టిబూటకంబె॥

గీ॥ సంఘసంస్కారమును మతసంస్కృతియును
దేశసంస్కారమున నిట్లు తెల్లముగ స
మన్వితము లౌటఁ జేసెడు యత్నమెల్ల
ధారపోయుడు దాని కందఱునుగూడి॥

గీ॥ ఇట్లుచేసిన మనదేశమెల్లవసుధ
కొజ్జయై యన్ని విధముల నుండనోవు;
ప్రజయుఁ బ్రస్తుతదైన్యంబు వాసి యొకట
నైహికాముష్మికైశ్వర్య మందనోవు

కం॥ "రాజునకుఁ బ్రజ శరీరము
రాజుప్రజకునాత్మగాన రాజునుబ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవి
రాజితులైయుండవలయు రక్షార్చనలన్"॥

కం॥ అనునార్యోక్తిని మఱవక
ననవరతముఁ బ్రజలుప్రభువు లనురక్తిమెయిన్
వినుతైకమత్యభావము
పనుపడ వర్ధిల్లుచుంద్రు ప్రాజ్ఞులు పొగడన్॥

గీ॥ శ్రీకరుండును భవ్యగుణాకరుండు
లోకకర్తయు దుర్జనానీకహర్త
భక్తవత్సలుఁ డర్థి కల్పద్రుమంబు
నెలమితోడయ్యెడును మన కిందునెప్డు॥

కం॥ వందేమాతర మనునీ
వందారుజనాళి కెప్డు వాత్సల్యముతో
డం దేశమాతయమితా
నందం బొనగూర్చుగాత! సానార్థదయై॥



“సర్వేజనాస్సుఖినోభవంతు”
“ఓం తత్ సత్.”



# ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము

## (లిమిటెడ్), బందరు.

ఆంధ్రభాషయందుఁ బ్రకృతిశాస్త్ర, దేశచారిత్ర, మహాపురుషజీవితాదివిషయకగ్రంథములు లేని లోపమును నివర్తింపఁజేసి యాంధ్రప్రపంచంబుం గ్రమ్మియున్న యజ్ఞానాంధకారంబును సత్యశాస్త్రజ్ఞానప్రభాకర ప్రభావిభవంబుచేఁ దొలంగింపనెంచి దేశాభిమానధురంధరు లగువిద్వాంసులు కొంద ఱీసంఘము నేర్పఱిచిరి. ఇందనుక నీసంఘమువారిచే సిద్ధపఱుపఁబడినగ్రంథముల వివరణం బీక్రిందఁ బొందుపఱిచితిమి:—

1. భారతధర్మదర్శనము:—మనోహరాలంకార శోభ గుంపవఁ దేనెలొలుకుతియ్యనిపలుకులం జదువరుల నమందానందపయోధినిర్మగ్నచేతస్కులం గావించుచు, నిర్మలదేశానురాగముం బ్రబోధించు పద్యకావ్యము.

వెల రు 0—2—0; చందాదారులకు రు 0—1—6.

2. పీష్వానారాయణరావు:—శోకకరుణాదిరసపూరితంబై చదువరులమనస్సు గరఁగునట్లు చక్కఁగ వ్రాయఁబడిన వచనకావ్యము.

వెల రు 0—1—0; చందాదారులకు రు 0—0—9.

3. అక్బరుచరిత్ర:—సర్వసద్గుణాలంకారుండై సుకవిజనవర్ణనీయుండై, సర్వజనసమత్వంబు గల్గి, విపులకీర్తిం గాంచిన చక్రవర్తియొక్క పుణ్యచారిత్రము. ఆకాలపు హిందూదేశస్థితి యంతయు నీపొత్తమునఁ గన్నులఁగట్టినట్లు మిగుల నిపుణముగ వర్ణింపఁబడియున్నది.

వెల రు 0—6—0; చందాదారులకు రు 0—4—0.

4. వివేకానందస్వామి జీవితము:— మనోహర వాగమృతధారం గురిపించి అమెరికా ఖండంవాసులం గూడ వశీకృతులం జేసికొని భరతవర్షంబు వారింతటి మహనీయులె! బలే! యని పాశ్చాత్యులు దలంచునట్లొనర్చిన మహాయోగిజీవితము. 157 పుటల గ్రంథము పటములతో.

వెల రు 0—10—0; చందాదారులకు రు 0—6—0.

5. సిక్కులచరిత్ర:— ధర్మార్జునాదిమహామహులజన్మభూమి యగుభరతఖండంబు కీర్తినిల్పిన సువిక్రమధనుల దివ్యచారిత్రంబు. పటములతో 256 పుటల గ్రంథము.

వెల రు 1—0—0; చందాదారులకు రు 0—10—0.

6. విద్యాసాగరునిచరిత్ర:—నిర్మలవిజ్ఞాన విశారదుండు, ననిర్వచనీయ కళ్యాణగుణాకరుండు, నార్తజన సంత్రాణ పరాయణుండగు నిట్టిమహనీయుండు త్రికాలంబులం గలుగండంచు విబుధప్రపంచంబు సంభావింపం జెన్నారిన పుణ్యపురుషుని చారిత్రంబు. ఆంధ్రభాషం జదువ నేర్చినందుల కీపొత్త మొకటుండ సంపూర్ణ ప్రతిఫలం బొసంగుటకుం జాలియుండు. 150 పుటల గ్రంథము పటముతో

వెల రు 0—9—0; చందాదారులకు రు 0—6—0.

రామ మోహన రాయల చరిత్ర:---నిర్మల బ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబుం గావించి, అనాథ లగుయువతులను బట్టి బలవంతముగం గాల్చివేయు సతి యను భయంకరాచారంబు నడంచి తన మాతృభూమి యగు భరతవర్షంబు నుద్ధరింపం దత్పూర్వ మెన్నండు హిందువు లెవ్వరును వెళ్లుటకు సాహసించని ఖండాంతరమున కనేక మాసములు మహార్ణవముపైం బయన మొనర్చి యచట మనకొఱ కనేక యుపన్యాసముల నిచ్చి కార్యవిజయము గాంచువఱకుం బట్టువిడువక తన దేశమాత కొఱ

